# తణుకుతా జమీదారీరైతు మహాసభ

---

## మండేశ్వర శర్మగారి అధ్యక్షోపన్యాసము.

తే 5_11_32 దిన ' అయిన ప్రమ గ్రామమున సమావేశమైన తణుకుతాలూకా జమీందారీ రైతుసభకు అధ్యక్షత వహించినదె, మండేశ్వర శర్మగారి అధ్యక్షోపన్యాస సంగ్రహము.

భూపుత్రి సోదరులారా!

దేశచరిత్రయందును జమీందారీరైతు ఉద్యమ చరిత్రయందును కూడ ప్రాముఖ్యమైన యీదినమున సమావేశమైన మీతాలూకా మహాసభ ధన్యమైనది. దేశములోని భూభాగములో సగమునకు పైగా జమీందారులకు చెందియున్నది. దేశపు ఆర్థికాభివృద్ధికి అవసరమైన నదులు తటాకములు ఖనిజములు అరణ్యక సంపత్తు అధికముగా యీ జమీందారీలలో నిరుపయోగముగ పడియున్నది. దేశములోని జన సంఖ్యలోను ఓటర్ల సంఖ్యలోనుకూడ అధిక భాగమిా జమీందారులలోనే యున్నారు. కాని దేశముయొక్క అజ్ఞానమునకు దారిద్ర్యమునకు సంఘీభావపులేమికి యీ జమీందారీ ప్రదేశములే గర్భగుళ్ళు. భారతదేశపు ఆర్థిక సంపదకు వెన్నెముక అయిన జమీందారీ రైతుల ఆర్థికపరిస్థితి బాగుపడినగాని దేశమునకు దుట్టి శాంతి సౌఖ్యములు నుండజాలవు.

నేడు రష్యా, ఇటలీ, అమెరికా, మున్నగు దేశములలో కృషీవలుని యభివృద్ధికై యనేక జయప్రదమైన పరిశోధనలు చేయబడుచున్నవి. రష్యాలో నేటికి యించుమించు పరిసమాప్తమైన పంచవర్ష విధానము (Five year plan) క్రింద దేశములో యించుమించు ప్రతిపల్లెకును విద్యుచ్ఛక్తి కల్పింపబడినది. పంటలుదిగుబడి రెట్టింపుకు వృద్ధియైనది. "వాల్గా" నదిలోనుండి తీయబడిన విద్యుచ్ఛక్తివలన సదరు జిల్లాలోని ప్రతిగుడిసెలోను గూడ విద్యుచ్ఛక్తితో పంటలు జరుగుచున్నవి:— సంకల్ప బలమున్నచో మనముగూడ ఆదేశములవలె నార్థికాభివృద్ధిని పొందగలము.

### హెచ్చు శిస్తులు.

1871 సంవత్సరమున ఆ ప్రాంతములలో వచ్చిన చొక్కలింగము పిళ్ళె కేసులోని హైకోర్టు తీర్పునకు పిమ్మట 1908 సంవత్సరపు ఎస్టేట్సులాండు చట్టమునకు పూర్వమును జమీందార్లు రైతులపై



**కుమారరాజాగారూ!**
ఇది మాట తప్పుట కాదా ?

---

స్న 1336 ఫసలీ సుక్తి బాబజు ముజరా బాపుకు మాచేత ప్రోనోట్లు వ్రాయించుకొంటిరే! మేముకోరినట్లు ఓట్లు యిస్తే ప్రోనోట్లు వాపసు యిస్తామంటిరే! తమకు, తమతోటి తోడిపెండ్లికొడుకుకు యిద్దరికి ఓట్లు యిస్తిమే! మా ప్రోనోట్లు యిచ్చినారా?

అనన్ని యిప్పుడు దావాల కెక్కిస్తున్నారటనే! ఇదేం న్యాయమయ్యా!

ఈలాచేస్తే ఇకముందుమిామాట లెవరు నమ్ముతారు?

ఇకనయినా మాప్రోనోట్లు మామొఖాన పారవెయ్యించి మాట దక్కించుకోండి ప్రభో!

" నీపాదసేవకుడగు రయితు "



శిస్తులను విపరీతముగా హెచ్చించిరి. యెస్టేటులాండు చట్టము సదరు శిస్తులయొక్క న్యాయాన్యాయములనుగూర్చి విమర్శింపబూనలేదు. పైగా ఈ అధిక శిస్తులనే యిరువది సంవత్సరముల కొకసారి గింజల ధరలు హెచ్చినను కారణముచే రూపాయ 1 కి రు 0-2-0 చొప్పున హెచ్చించుటకు అవకాశమీయబడినది. కాలమాన స్థితినిబట్టి రైతువారీ రైతు వల్లనైనా కనీసము పొందుటకు జమీందారీ రైతునకు హక్కులేదు. ఇక కోర్టుద్వారా స్టాంపుఖర్చులు ప్రయివేట్లు పెట్టి తినుటకు నోచుకొని రైతు దావాకు దిగుట అసంభవము.

ప్రస్తుత ఆర్థిక స్థితి జమీందారీ రైతును మతింత క్రిందదీసినది. ప్రక్కరైతువారీ భూమి అయినమాన్యముల రేటుకిలిగియుండగా జమీందారీ జిరాయితీ ఎకరమునకు 15 రూపాయలచొప్పున రేటుకిలిగియుండుట చేసెనుగుదుము. ప్రస్తుత ఆర్థికస్థితి యీ హెచ్చు శిస్తులను మతింత హెచ్చించినది. సదరు హెచ్చుశిస్తులకు ఇదివరలో ధరలప్రకారము రెండున్నర బస్తాలను పన్ను నిమిత్తమమ్ముట చే కట్టునని తోచినరైతు నేటి ధరప్రకారము అయిదుబస్తాల నమ్మినగాని పన్నుభారమునుండి విముక్తుడు కాజాలడు.

### యెస్టేటులాండుచట్ట సవరణ

యెస్టేటులాండు చట్టము రైతునకుగల సాగుహక్కును కొంతవరకు స్థిరపరచినను పారబంజరు" స్వంత సేద్య" భూములక్రింద పూర్వ నిరంకుశత్వమును సాధించుచున్నది. నీటివసతుల మరమ్మతు చేయడము విషయములో పశుమేత రైతులకు అడవులు కంచెలులో గల హక్కులను కాపాడుటలోను పట్టాలు మార్పిడిలలోను న్యాయస్థాన నిర్మాణము, దానివిధానములోను దేశాభివృద్ధికి ప్రతికూలముగను రైతుపట్లన్యాయ వ్యతిరేకముగను ఉన్నది. ఇవిఇట్టి లోపములు సవరణ కావలెనని ఆంధ్ర జమీందారీ రైతుసంఘము, నెల్లూరు, పశ్చిమగోదావరి, గంజాము, విశాఖపట్టణము మున్నగు జిల్లాలు, సంఘములు, మద్రాసు రాజధాని రైతుసంఘములవారు ఆందోళనము చేయుచుండిరి. ఆంధ్ర జమీందారీ రైతు సంఘమువారు ఒక ఉపసంఘమును నియమించి యింనమునుగూర్చి ఒకసవరణ విధానమును సూచించిరి. కాని ప్రాక్టైనుకోరగా రాయి ప్రతిపాదింపబడినది. 20 సంవత్సరములనుండి రైతులు ఆతురతలో వేచియుండగా 1931 సంవత్సరములో ప్రభుత్వమువారొక సవరణ చట్టము శాసనసభలో ప్రవేశపెట్టిరి. ఈ బిల్లు పైదోషములను నివారింప బూనలేదుగదా అడవిమేత పసులను, చేపలపాటు మొత్తము, శిస్తులను నిర్ణయించుటకైన చేర్చుటను, లంకలను రైతి, నాక్రైతిగా విభజించుటను, జలాశయముల మరమ్మతు విషయములో నెట్టుఆర్జిలకు ధరావతును ఏర్పాటుచేయుటను, కొన్ని అపకారములను కూడ సూచించియున్నది. జమీందారుల ప్రాబల్యములో నుండి రైతులకు లేకు ప్రాతినిధ్యము లేకపోవుటను, అవసాన కాలములోనున్న ప్రస్తుత శాసనసభలో ఇట్టిబిల్లు పెట్టుటకు వీలులేదని పైసంఘముయున్ను అనేక రైతు మహాసభలున్ను తీర్మానించినవి. కాని ప్రభుత్వమువారు వినలేదు. త

జమీందారీరైతు.

శనివారము.

౨౭—౧౧—౩౨.

## స్థానిక సంస్థల పోటీ.

---

నెల్లూరుజిల్లాలో లోకలు బోర్డు యెన్నికలకు యీ నెల తే 14 ది నాడు నామినేషన్లు దాఖలు చేయబడినవి. (కావలి, కందుకూరు తాలూకాలకు తప్ప) మొత్తముమీద మునుపటివలె పోటీలు తీవ్రముగా నుండునట్లు కనుపించుటలేదు. జిల్లాబోర్డుకు నిర్ణయింప బడిన 52 స్థానములలో పందొమ్మిదింటికి పోటీలేకనే సభ్యులు యెన్నుకొనబడిరి. కొన్ని తాలూకా బోర్డులందు ముఖ్యముగా నెల్లూరు, కోవూరు లందు, అత్యధిక సంఖ్యాకులకు ప్రత్యర్థులే లేక పోయిరి.

ఇంతమాత్రమున మన జిల్లాయందు పార్టీపంతముతోగాని వ్యక్తి ద్వేషముతోగాని పరస్పర శాఖా వైమనస్యముతోగాని యెన్నికలు జరుగుటలేదని తలచుట పొరబాటు. ఇందుకొరకై మనలను మనమే మెచ్చుకొనుట అకారణ సాహసమే యగును.

జరుగుచున్న ప్రతిపోటీయు పైకారణములమూలమున మాత్రమే ననియు, రాజకీయాభిప్రాయముల ననుసరించిన కక్షలుగాని, కడకు ప్రజాసామాన్య లాభముల నాహాకేయు పార్టీలుగాని మన జిల్లా కపరిచితములని అనుభవజ్ఞులకు తెలియని విషయముగాదు.

ఆర్థిక విపత్తులలో మునిగి నేడు జమీందారీ గ్రామములందు మాత్రము రయితుసంఘము తరఫున అభ్యర్థుల నియామకము జరిగినది. తక్కినవానిలో చాల చోటులయందు వ్యక్తి పరమగు దృష్టియే! ఏ మార్గము నవలంబించిన యెడ నెక్కువ లాభమునో, గౌరవమునో, అధికారమునో పొందగలమను యోచన తప్ప ఇందు వేరు లేదు. ఈ దృష్టికి దోహదమొసరింప జాలు ప్రతియుక్తియు నన్వేషింప బడుచుండుట కాదనజాలము.

అట్లయిన యీ పరివర్తనమునకు కారణమేమి? ఇంతటి సహానమెట్లు వడినది. ఇందులకు కారణములలో కొన్ని: మొదటిది—ఆర్థిక పరిస్థితులు. సిద్ధాంతములపై నాధారపడక వ్యక్తుల స్థానిక బలాబలముల నిర్ణయముపై ఫలిత మేర్పడవలసియుండుట రెండవది. అధికారవర్గమునకు సన్నిహితులుగా ప్రస్తుతమున్న వారికి, ఉండబోవు వారికి సర్కిళ్ళ విభజనము మొదలగు విషయములందు యెన్నికలలో గెలుపొందుటకు తగు సౌకర్యములు—అనుకూలములు యేర్పడుట మూడవది. కొల్లి మొదలగువాని మూలమున గ్రామముల సంఖ్య ప్రాముఖ్యత జనబాహుళ్యముకువ్యతిరేకమగు స్థలభాగనిర్ణయములు, ప్రతినిధి సంఖ్యా నియామకము నందు వ్యత్యస్తములు కలుగుట. నాల్గవది—ఓటర్ల సంఖ్య పెరుగుటయు విరుగుటయు అధికార వర్గమువారి సౌజన్యముపై కృపాపరిపూర్ణ దృష్టిపై నాధారపడియుండుట యిట్టివి ఎన్నియోగలవు.

ఇంతవరకు చెప్పవచ్చిన దేమన-పోటీలు తీవ్రముగ లేకుండుట వక్రమార్గ విజయమువలన ప్రజా సామాన్యమునందు గలిగిన తాత్కాలిక నిరుత్సాహ నిస్పృహలవలన నేర్పడిన జడత్వమేకాని అనవసర కల్లోలములకు ధనవ్యయములకు సందేహించెడు విజ్ఞానముయొక్క ఫలితము మాత్రమే కాజాలదు. దేశమునం దిట్టి జడత్వము నాపాదింపజేసిన వారును వక్రమార్గముల మాటమున సహజమగు స్పర్ధ కనుకూలవాతావరణమును నిర్మూలింపజేయు వారును అధికారబలమున నందులకు దోడ్పడువారును దేశాభ్యుదయము నరికట్టిన వారగుదురు.

చైతన్యమే ప్రాణలక్షణము అదియే జీవకళ. పోటీలేకుండుట అభ్యర్థులకెంత సంతోషదాయకమైనను పోటీలేనిచో యెన్నికలు యుద్దేశమే భంగమగుచున్నది. పోటీ యున్నప్పుడు మాత్రమే అభ్యర్థుల గుణాగుణములను అర్హతానర్హతలను ప్రజలు గుర్తెరుగుట కవకాశము గలుగుచున్నది. విమర్శన భయములేనిచో నెట్టి వ్యక్తియైనను నిరంకుశుడై ప్రజాభిప్రాయమును తృణీకరింప జూచుట సహజము. తన కార్యముల ప్రపంచము గమనించుచున్నదనియు, అట్టికార్యముల నొనరింపనట్లు స్థానముల నధిష్ఠించుటకు ప్రజాసహాయ మవసరమనియు తెలుసుకొన్నప్పుడు మాత్రమే వారి శ్రేయాభివృద్ధి దృష్టియుంచు కొనుట కర్తవ్యమగును. ప్రజా హిత జీవనముయొక్క మూలసూత్రమేయిది!

---

# నెల్లూరుజిల్లా లోకల్ బోర్డుల ఎన్నికలు.

——:o:——

## ఎలెక్షన్ ఆఫీసరు న్యాయబుద్ధి.

నెల్లూరుజిల్లా ఎలెక్షన్ ఆఫీసరు వారు అను శీర్షిక క్రింద స్వతంత్ర పత్రికలో ప్రచురించిన వ్యాసమును బాగుగా చదివితిని. శ్రీ వారు మన నెల్లూరుజిల్లా యొక్క భాగ్యవశమున జిల్లా ఎలెక్షన్ ఆఫీసరుగా నియమింపబడిరనియు, వారు వోటర్ల లిస్టును తయారు చేయుటలో నిష్పక్షపాతముగ యుండిరనియు, అట్టి మహానుభావులును, ఉదారగుణ సంపన్నులున్ను, దయాస్వరూపులును, నిష్పక్షపాతశీలురును, మనజిల్లాకు ఇంతకు ముందుగాని, యిక ముందుగాని లభించరనియు, మిగులకొనియాడిరి. ఆ పత్రికయందా వ్యాసమును చదివినంతనే నాకుకూడ, వారిని గూర్చి కొంత ప్రసంశచేయ వలయుననియు, నెల్లూరుజిల్లా లోకల్ బోర్డుల యెన్నికలలో జరుగు కొన్ని విషయములు జిల్లావాసులకు తెలియజేయ వలయుననియు కుతూహల మానసుండనైతిని.

మనజిల్లా లోకల్‌బోర్డులయొక్క వోటర్ల లిస్టును ఆగస్టునెల తే 6 ది శ్రీ ఓ. జె. గజపతినాయుడుగారు, ఎలెక్షన్ ఆఫీసరువారు చేవ్రాలుతో ప్రచురింపబడినది. దానిమీద హక్కులు ఆక్షేపణలు తెలుపుకొనుటను సెప్టెంబరు తే 5 ది వరకు గడువు యివ్వబడినది. సెప్టెంబరు నెల తే 5 ది మధ్యాహ్నం పగలు 2 గంటలకు నెల్లూరుజిల్లా కావలి తాలూకా తాళ్ళపాళెం గ్రామమునుండి 230 వ్రాతమూలకమైన కౌలు హక్కు వోటర్లను కందుకూరు తాలూకానుండి షుమారు 1400 వ్రాతమూలకమైన కౌలు హక్కుదార్లను శ్రీ ఎలెక్షన్ ఆఫీసులో దాఖలుచేసిరి. సదరు హక్కులు పోస్టుద్వారా పంపక రెండు తాలూకాలనుండి యిద్దరు మనుష్యులు తీసుకొనివచ్చి దాఖలుచేసిరి.

ఆ నెల తే 12 ది సదరు హక్కులను సదరు ఆఫీసులో సి (కౌలుదార్లు) అను హక్కుదార్ల క్రింద ప్రచురపరచిరి. ఈ కౌళ్ళన్నియు తాత్కాలికముగ సృష్టింపబడినవనియు విచారణ చేసి నికరమైన కవుళ్ళని తేలినచో వోటర్ల లిస్టునందు చేర్చవలయుననియు కావలి, కందుకూరు తాలూకాల నుండి కొంతమంది ఆక్షేపణలను దాఖలు చేసిరి. విచారణ సెప్టెంబరు తే 22 దికి వేయబడెను. కావలి, కందుకూరు తాలూకాల తరఫున మ॥రా॥శ్రీ బి. అన్నాస్వామయ్యరుగారిని వకీలుగా నియమించిరిగాని, వారిని 1630 వకాల్తా నామాలు దాఖలు చేయమని చెప్పుటచే సదరు ప్లీడరువారు వారి తరఫున వాదించుటకు వీలులేక పోయెను. తాళ్ళపాళెం గ్రామ కౌళ్ళను చూచుటకు 10 నిమిషములు పరిశీలించి, పరిశీలించిన అధికారి వెంకటనరసింహంగారు యీ క్రింది విధముగా కౌళ్ళన్నియు అబద్ధములని నిర్ధారణ చేసిరి.

(1) తాళ్ళపాళెం గ్రామములో యిలాకా 230 కౌళ్ళలో షుమారు, 100 కౌళ్లు శ్రీ వెంకట్రామిరెడ్డిగారును మునసబు షుమారు 80 కౌళ్లు శ్రీ ఆదిశేషారెడ్డిగారును, షుమారు 30 కౌళ్లు శ్రీ హరిశ్చంద్రారెడ్డిగారును, తతిమ్మ 20 కౌళ్లు శ్రీ దండి సుబ్బరామయ్యగారును, (కరణము) యిచ్చియుండిరి. వారు యిచ్చిన కౌళ్ళన్నియు మాలవారికని షుమారు 2 3 సంవత్సరములనుండి యిచ్చియుండిరి. 2-3 సంవత్సరముగా ఆ కౌళ్లు వ్రాయబడిన కాగితములు మాలవారి చేతనున్నను, నక్కమడతగూడ లేక బజారులో అమ్ము కాగితమువలె యేమియు నలగక యుండెను. అట్లు వుండుట మిగుల దుర్లభమనియు.

(2) సిరా, కాగితము, వ్రాతము వారు సాక్షి, సంతకము చేసినవారు అన్నిటియందు వకటిగానే యుండిరనియు,

(3) అన్ని కౌళ్ళలోను 0-50 సెంట్లు కంటె జాస్తి లేదు. అట్టిది దుర్లభమనియు,

(4) అంతచిన్న గ్రామములో 230 మంది కౌలుదార్లు యుండుట నమ్మతగినదనియు,

(5) వకయింటిలో యుండు మగవారిలో ప్రతివానిపేర వక్కొక కౌలు వున్నదనియు అట్టిది అంగీకరించ గూడదనియు,

(6) ఈ హక్కుదార్లకు తెలియకనే, యితరులు వారిపేర కౌళ్లువ్రాసి, హక్కులను ఎలెక్షన్ వారి ఆఫీసులో దాఖలు చేసిరనియు,

(7) కౌళ్లు యిచ్చినవారు తండ్రి, కొమారులును, గ్రామకరణముగా యుండిరనియు, వారి కుమారులలో శ్రీ వెంకట్రామిరెడ్డిగారు మునసబుగాయుండి, వారే వారు యిచ్చిన కౌళ్ళమీద, కౌళ్లు నిజమని సర్టిఫికేటు వ్రాసిరనియు అది అంగీకరించుటకు వీలులేదనియు,

(8) హక్కులయొక్క 3-వ నంబరు నమూనాలో వేయబడిన బొటనవ్రేలు గుర్తులు వారివిగావనియు, బట్లదిన్నె గ్రామములో విచారించగా వారికేమియు తెలియదని వారు కౌలుదార్లు కాదని వారు బొటనవ్రేలు గుర్తులు వేయలేదని చెప్పిరనియు, అట్టిది విచారించ వలయుననియు,

(9) కొంతమంది కౌలుదార్లు పైసర్లుగా యున్నారనియు,

(10) యింకాకొన్ని ఆక్షేపణలను చేసిరిగాని, శ్రీ ఎలెక్షను ఆఫీసరువారు యీ ఆక్షేపణలను త్రోసివైచి, అందరి పేర్లను వోటర్ల లిస్టునందు చేర్చిరి. శ్రీ ఎలెక్షను ఆఫీసరువారు ఎంత నిష్పక్షబుద్ధితో చేసినది బయల్పడును. అందుమీఁదట కందుకూరు, కావలి తాలూకాలనుండి శ్రీ డిప్యూటీ యినస్పెక్టరు గారగు బ్రా॥శ్రీ యు. నరసింహారావునాయుడిగారికి అప్పీలు చేసిరి. వారుగూడ శ్రీ ఎలెక్షను ఆఫీసరువారి నడతనే అనుసరించిరి. ఆక్షేపణలన్నియు, శ్రీ యినస్పెక్టరుగారు పంపిన 13 వ ఆర్డరు ననుసరించి, గ్రామాధికారుల సర్టిఫికేటును ఆధారముచేసి కొని నిరాకరింప బడినవి. అట్టి నా 13 వ ఆర్డరును కొట్టివేయవలయునని, అళహరి నరసింహ ఋత్తుల పేరారెడ్డిగార్లు హైకోర్టులో పిటిషను దాఖలు చేసిరి. హైకోర్టువారు ఆ ఆర్డరును ఖర్చులతోటి కొట్టివేసిరి. అప్పీళ్ళు హైకోర్టువారి ఆర్డరును అనుసరించి పెండింగులో యున్నవి. అందుచేత కావలి, కందుకూరు తాలూకాల నామినేషనులు ఆపుదల చేయబడెను.

---

## తాలూకాబోర్డు నామినేషనలు.

—(౦)—

నాయుడుపేట ఫిర్కా.

1. టి. వెంకటస్వామిరెడ్డిగారు, 2. దేవరా చెంచుసుబ్బయ్య, 3. మున్వార్ల సుబ్బరాఘవరెడ్డిగారు, 4. (క్రైస్తవ రిజర్వుడు స్థానము) పుల్లూరు యింద్రయ్య.

వేముంబాక ఫిర్కా.

1. దేగా చెంచురామిరెడ్డిగారు, 2. మున్వార్ల రంగారెడ్డిగారు, 3. కళత్తూరు వీరాస్వామి రెడ్డిగారు.

దామ నెల్లూరు ఫిర్కా.

1. శ్రీనివాసులురెడ్డిగారు, 2. పృథివి మునుస్వామిరెడ్డిగారు.

యాకశిరి ఫిర్కా.

1. మారంరెడ్డి మునిరెడ్డిగారు,
2. జన్నారెడ్డిగారు.

మల్లాం ఫిర్కా.

.1 గొడవలూరు రాఘవులునాయుడుగారు, 2 వాళెంగి చిన సుబ్రహ్మణ్యం శెట్టిగారు.

కల్లూరు ఫిర్కా.

1. బద్దెభూడి వెంకటనారాయణ రెడ్డిగారు, 2. వంకాయలపాటి సుబ్బానాయుడుగారు.

సూళ్లూరు పేటఫిర్కా.

1. మారంరెడ్డి సుబ్బరాఘవరెడ్డిగారు, 2. వీరశ వెంగలాయిశెట్టిగారు, 3. శ్రీనాథం మునిరత్నమయ్యగారు, 4, లలిశెట్టి వెంకటేశం శెట్టిగారు, 5. కళత్తూరు వీరాస్వామిరెడ్డిగారు.

### హ రి జ న ల రి జ ర్వు డు.

సూళ్లూరుపేట ఫిర్కా.

వెల్లూరు వీరాస్వామిగారు, 2. వేలూరు నడిపి వీరయ్యగారు.

తడ ఫిర్కా.

1. వేనాటి మునుస్వామిరెడ్డిగారు, 2. కే. సుబ్బరాఘవ రెడ్డిగారు, పురాప్, బత్తులవలంరెడ్డి, 3. కళత్తూరు వీరాస్వామి రెడ్డిగారు.

మహమ్మదీయుల స్థానం.

1. యస్. యిబ్రహిం సాహెబుగారు.

వేనాడు ఫిర్కా.

1. పేట శ్రీనివాసులురెడ్డిగారు, పోటీ లేదు.

శ్రీహరికోట ఫిర్కా.

1. కాపునేడు సుబ్రాయులుగారు, పోటీ లేదు.

### వెంకటగిరి తాలూకాబోర్డు.

వెంకటగిరి ఫిర్కా

1. జూపల్లి వెంకటరామారావు, 2. యినుకొండ నారాయణస్వామి, (Barber.)

మహమ్మదీయ స్థానము.

1. మహమ్మద్ ఖాజా దస్తగిరి, 2. షేక్ రంతుమియ్యా,

ఆది ఆంధ్రస్థానము.

1. కలపాటి చిన వెంచలు, 2. బోరు వెంచలు.

పారవోలు ఫిర్కా.

1. వేముల వెంకటరామయ్య, 2. జూపల్లి రంగయ్య.

క్రిస్టియను స్థానము.

1. సారి రాఘవులు, 2. వెల్లూరు వెంకయ్య, పురాప్ చక్రయ్య.

డక్కిలి ఫిర్కా.

1. వల్లం వెంకటక్రిష్ణయ్య, 2. కటికనేని కల్యాణరావు.

దగ్గవోలు ఫిర్కా.

1. కొండూరు వెంకటాద్రిజు, 2. కటికనేని వెంకటరామారావు.

---

## పాదిలి నామినేషనుల తగాదా.

మాకినేని నర్సయ్యగారు జిల్లాబోర్డు కంట్రాక్టుతో సంబంధము కలిగియుండినందున ఎలెక్షను పోటీచేయుటకు అనర్హుడని జూపల్లి గురప్పనాయుడుగారు యెలక్షను ఆఫీసరుగారి వద్ద తే 5-11-32 ది నామినేషనుల పరిశీలన రోజున ఆక్షేపించిరి. నర్సయ్యగారు తాను 12-11-32 తేదిన పెట్టుకొన్న అర్జీమీద జిల్లాబోర్డు యింజనీయరుగారు యిచ్చిన తే 14-11-32 ది గల వృత్తాన్నము దాఖలుచేసి తానుఅర్హుడనేననెను. ఈ వృత్తాన్నములో నర్సయ్యగారి తాలూకు లెఖలు పూర్తి అయినవనిన్ని, వారిపేర కంట్రాక్టర్ల లిస్టులోనుండి తొలగించ బడినదనిన్ని వున్నది. ఎలక్షను ఆఫీసరువారు ఆక్షేపణను త్రోసివేసి నర్సయ్యగారి నామినేషనును ఖాయపరచిరి.

ఎలెక్షను ఆఫీసరుగారి తీర్పుమీద స్థానిక స్వపరిపాలన కార్యదర్శి గారికి తే 21-11-32 దిన గురప్ప నాయుడుగారు ఆక్షేపణ అర్జీలు దాఖలుచేసిరి.

---

## బందెపైకం అంతర్ధానమగుట.

వెంకటగిరి డివిజను (1) అల్తూరుపాడు (2) తిర్పపాడు (3) నిడిగల్లు (4) వెంకటగిరి మొదలగు గ్రామముల తాలూకా బందెపైకం కొన్నిమాసములుగా గ్రామాధికార్లు ఖజానాకు పంపుచుండినట్లును వారికమీషనుగాని యిర్సాలునామాగాని గ్రామాధికార్లకు చేరనట్లును, నేడు బైటబడినది. పౌండు గుమాస్తా పరశురామయ్యగారిని సస్పెండులో వుంచబడియున్నది. రకార్డంతయు గూడూరు సబ్ కలెక్టరువారి వల్ల సీలుచేయబడియున్నట్లును తెలియుచున్నది.

## కాళహస్తి తాలూకాబోర్డు, జిల్లాబోర్డు, ఎలక్షన్.

జమీందారీ పక్షము తంత్రము.

కాళహస్తి తాలూకాబోర్డు మెంబర్ల ఎలక్షనునందు పోలింగుస్టేషనులను నియమించుటలో ప్రెసిడెంటు, మెంబర్లు, స్థానములను వినవారుట కిష్టములేక జన్మహక్కుగానుంచుకొన గోరినవారు గ్రామములను తమకనుకూలముగా విభజించి పోలింగు స్టేషనులను ఏర్పాటుగావించినటుల తోచుట పాఠకుల కతిశయోక్తి కాజాలదు. పూర్వపు మెంబర్లు ప్రెసిడెంటు, చేసిన మోసాపాయములను నూతనముగ మెంబర్లు కాగోరువారు తెలిసికొన నంతటి అవకాశము లేకపోయినను తమకు గల విశేష పలుకుబడిచే, జన్మహక్కు సంపాదించు కొనగోరిన వార్లను ఢీకొని గెలుపొందుటకు అవకాశము లభించి నందుకు సంతసింప వలసియున్నది.

8-వ సర్కిలుకు పూర్వపు మెంబరగు నెలబల్లెగ్రామము కాపురస్థుడు శ్రీయుత బియ్యపు వెంకటరెడ్డిగారికిని, కన్నలి గ్రామకాపురస్థుడు శ్రీయుత కన్నలి రామిరెడ్డి గారికిని పోటీజరుగనుండుట తెలిసి రామిరెడ్డిగారికి పలుకుబడిగనుండు చుట్టుపక్క 20 గ్రామములను సూరాం సర్కిళ్ళకు పంచిపెట్టి పెద్ద కన్నలి గ్రామము మాత్రము రామిరెడ్డికి (క్యాండిడేట్) ఏలాటి సంబంధము లేని యితర గ్రామములతో చేర్చి రాగులపాడు పోలింగు స్టేషనుగ నియమించిరి. మరల ఏకారణము చేతనో రాగులపాడు పోలింగుస్టేషనును రద్దుపరచి రామిరెడ్డిగారితో పోటీచేసి యుండు బియ్యపు వెంకటరెడ్డిగారి స్వగ్రామమగు నెలబల్లెను పోలింగుస్టేషనుగ మార్పుపరచిరి. పై సందర్భమును గురించి మద్రాసులోని, పున్నతాధికారులకు (ఫస్ట్ మినిష్టర్, లోకల్ బోర్డుల ఇన్స్పెక్టర్)ను, ఎలక్షన్ ఆఫీసర్ గారికిని ఆగష్టు మొదటి వారములో తెలుపగా పై యధికారులు ఏలాటి సౌకర్యమును కలుగజేసి కొనరైరి. మరల మూడవవారములో పైకనిన అధికారులకు తెలుపుకొనుటచే పాలమ్పూరు గ్రామమును సబ్ పోలింగుగ ఏర్పాటు చేయబడినది.

తే 15-11-32 ది ఎలక్షను జరుగబడినది. పోలింగుస్టేషనుగ నుండు గ్రామము వెంకటరెడ్డిగారి స్వగ్రామముగుటచే రామిరెడ్డిగారి యులాకావారికి అన్నపానాదులకుకూడ చోటివ్వక పోవుటచే, రామిరెడ్డిగారి స్వగ్రామమునుండి భోజన వసతులను కలుగజేసి కొనవలసినట్లు తటస్థించినది. వ్యవహార విషయములయందు కడు తీవ్రతతోనుండుట ఒప్పిదమైనను; భోజనవసతులను కలుగజేయక, కలుగజేయదలచువారిని అభ్యంతర పెట్టునంతటి అవివేకమునకొ కటుండెడని తలచుట కర్తవ్యము. ఇంతటి నిర్బంధముతో పట్టుదలగ కార్యము జరిగించినను, ఈ పోలింగునందు జమీందారీ రయితు పక్షముగనుండు శ్రీరామిరెడ్డిగారు 512 వోట్లతో జయమొందుటయు, జమీందారీ పక్షపు అభ్యర్థి బియ్యపు వెంకటరెడ్డిగారు 368 వోట్లతో అపజయమొందుటయు చూడ జమీందారీ రయితులయొక్క పట్టుదలవలన జయము లభించినటుల యూహింపదగియున్నది.

త్వరలో రానున్న శాసనసభ ఎన్నికలనూడ ఇట్టి కపట మోసాపాయములను వస్సు జమీందారులకు మోసమివ్వక స్వలాభాపేక్షాపరులుగాక జమీందారీ రయితులలు తమపార్టీ వారినె జయమొందునట్లు చేయుటకు బద్ధకంకణులై యుందురు గాక యని కోరుచున్నాడను.

ఇట్లు,
ఒకవోటరు,
పెద్దకన్నలిగ్రామం.

## మంగలి విజ్ఞప్తి.

ఓటరు మహాశయులారా!

నేను మోపూరు వాస్తవ్యుడను. మొదలరైతును, వెనుకముంగలిని పేదవాడనగుటచే రైతుకష్టసుఖములు సంపూర్ణముగా తెలుసును. తెలుగు ఇంగ్లీషులో నాకు కొలదిపరిచయముకద్దు. అవకాశము లభించిన ప్రజాసేవ చేయ సంకల్పముకద్దు.

కావుననే కొందరు పెద్దల ఆదరాభిమానమున తాలూకాబోర్డుకు వెంకటగిరిటవున్ సర్కిలుకు అభ్యర్థిగా నిలచితిని.

నిమ్నజాత్యుద్ధరణకై పాటుబడు మహాశయులు నన్నభిమానించి, గెలిపించి, ప్రజాసేవకు ఒకమారు అవకాశమొసగెదరని నాప్రార్థన.

నాతో పోటీకి నిలిచిన జూపల్లి వెంకటరామారావుగారికొక మనవి! తాము యిప్పటికి 12 సం॥ లుగా తాలూకా, జిల్లాబోర్డులయందు ప్రవేశించి పనిజేసి తనిసియున్నారు.

నేనా నిమ్నజాతివాడను. మాకు రిజర్వేషన్ లేదు. యింతవరకు మావారికి ఎవ్వరును అవకాశమిచ్చినదిలేదు. పోటీలేకనే నాకు అవకాశమిచ్చి యుండవలసినది. అటులైనను చేయజాలకపోవుట విచారకరము. ఇంతట నైనను నన్ను అభిమానించి నా అభ్యర్థిత్వమును గెలుపొందించెదరని ప్రార్థించుచున్నాను. నాతో పోటీచేసి గెలిచిన మువ్వల్ల క్షత్రియశిష్టులు రాజావుగాన నను యుంచి నన్ను గెలిపింతురని ప్రార్థన.

మోపూరు
22.11.32.

ఇట్లు,
మీవిధేయ సేవకుడు,
యినుకొండ నారాయణస్వామి.
మంగలి.

సంపాదకుడు, ముద్రాపకుడు, వెల్లూరు, వెంకటరామానాయుడు, జమీందారీ రైతు ముద్రాలయం, గాంధిచౌక్, నెల్లూరు.